శ్రీ శుభమస్తు.

# చిత్తోప రమణ శతకము.



ఈపుస్తకము

నైజాం యిలాకా నల్లగొండజిల్లా, హుజూర్ నగర్ తాలూకా

అడ్లూరు శివారు శోభనాద్రిపుర వాస్తవ్యులునగు

## వేంకట శోభనాద్రి కవిచే

రచియింపబడి, ప్రకటింపబడియె.

మొదటి కూర్పు ౫౦౦ ప్రతులు.



శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాలయందు
మా. రాఘవాచార్యులవారిచే
ముద్రింపబడినది.

1925.

 [వెల 0—౩—0.



శుభమస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# చిత్తోపరమణ శతకము.



ఉ. శ్రీగిరిజా సరస్వతుల ♦ శీఘ్రమెవిష్ణు కపర్ది సృష్టిల౯
సాగిలి మ్రొక్కి వేడుచును ♦ సారసవైరి ఖరాంశుమండలం
బాగతిచేసి తాపస వి ♦ హారత బెంపొనరించుచుండునో
నాగతుల౯ విసిష్టమయి ♦ నార్యులుమెచ్చ నుతించు చిత్తమా. 1

చ. హరియును శంభుమున్ విధియు ♦ నంచితమొప్పగ మూడురూపులై
పరగను వ్యాస వాల్మికులు ♦ పండితవర్యుడు కాళిదాసుడున్
నిరుపమవేత్తలై నిలచి ♦ నిండగుయోగమ శాస్త్రకావ్యముల్
పరచితజేసి హస్తతల ♦ పాటుననుంచిరి మ్రొక్కు చిత్తమా. 2

ఉ. తిన్నగ యాంధ్రసృష్టికిని ♦ దీర్పరినన్నయ దిక్కయజ్వ పో
తన్నయు శంభుదాసుడు త ♦ దాదిని గూర్చుచునున్నవారలున్
మన్నన సార్వభౌమకవి ♦ మాటికి పెద్దన ముక్కుతిమ్మనన్
యున్న కవీంద్రకోటులకు ♦ నూరికనూఱులు మ్రొక్కు చిత్తమా. 3

ఉ. శ్రీయొకపాదమ౯ బిరుదు ♦ చేకొనియుండిన కృష్ణశాస్త్రి సం
దేయనుపాయి శారద వి ♦ ధేయముగా కవిరాజటంచు తా
స్థాయినిజేసె నాయమకు ♦ సార్థకమొప్పగ కృష్ణభారతం
బీయెడ జేయుచున్న ఘను ♦ డేయని మ్రొక్కుము నిందు చిత్తమా. 4

ఉ. దేశములన్నియుం దిరిగి ♦ దెంపువహించి శతావధానముల్
జేసియు సత్కవీంద్రులని ♦ చేరువనున్న సభాదులెన్నగా
వాశికినెక్కు తిర్పతియు ♦ వన్నెకుదెచ్చిన వెంకటేశునిన్
భాశిల మ్రొక్కు బోధను ప్ర ♦ భాశిలనీతరి నింక చిత్తమా. 5

ఉ. శ్రీయుతమైన వెల్మకని ♦ క్షీర సముద్రపు యన్వయంబులో
బాయక నయ్యన్నశౌరి ♦ పండితుపత్నియు కామమాంబకున్
నేయముతోడ పుత్రుడిన ♦ నే నుదయించితి శోభనాద్రి నన్
కాయము వ్యర్ధమంచు కల ♦ కాలము చింతనజేయు చిత్తమా. 6

చ. శతకము శాస్త్ర సమ్మతము ♦ శాశ్వతబోధము నిర్విచారికిన్
పతకము ముక్తహారచయ ♦ పండితయుక్తము యోగిబృంద హృ
త్పతనము మోక్షసాధనము ♦ పాతక దగ్ధము పారమార్ధిక
వ్రతమునుగోరు తారకము ♦ వారక ముక్తిదమౌను చిత్తమా. 7

ఉ. సంతతి లేకయున్న మది ♦ జాలిబడున్ మనుజుండు నంతలో
సంతతిగల్గి బోయినను ♦ సార్వము పుత్రులకేడ్చు మానసం
బంత చికాకునొంది తన ♦ యాతనజెప్పను నొక్కనూను డ
త్యంతమనీషుడై చనిన ♦ యాతనిదుఃఖ మదెంతో చిత్తమా. 8

ఉ. చింతయు జెప్పశక్యమటె ♦ ఛీ యిదిప్రాణములున్న సావుగా
కెంతో దృఢంబు గల్గునదె ♦ నేమనిజెప్పను పూరికన్న నూ
రంతల దట్టమైన వ్యధ ♦ లంపటబెట్టదె యగ్నికీలలై
దంతరమే పురాకృతము ♦ దల్చిన దప్పదె మూఢచిత్తమా. 9

ఉ. ఎచ్చటనున్న నచ్చటనె ♦ హెచ్చుచునుండును తస్థళంబు మా
ముచ్చటదీర వాడబడు ♦ ముఖ్యము సంతతులేదులోపలన్
దిచ్చువరాలగచ్చు తగు ♦ దేయునవచ్చును వజ్రపఙ్క్తిగా
వచ్చును యచ్చులై దిశల ♦ వావిరికీర్తిని జెందు చిత్తమా. 10

ఉ. సచ్చరితంబులైన కృతి ♦ సంతతి కన్నను మిన్న యున్నదే
మచ్చికతోడ జెప్పినను ♦ మానక ముక్తి పదంబు జెందదే
యిచ్చును దీరదేసుఖము ♦ నేయడ గూడదె విన్నవించెదన్
బొచ్చము గాదు శ్రీహరిని ♦ బొందెడి మార్గము గల్గుచిత్తమా. 11

ఉ. భాసిల ముక్తికాంతయడ ♦ భావముజున్ని యనేక మోక్షమున్
వాసిగ దెచ్చుకొమ్ము పర ♦ వాసినివై విడబోకు నిత్యమున్

దాసికిదెమ్మ్ల సృష్టిని మి ♦ రాశిగ జూడకుసుమ్ము నేహ్యామా
గాసిలబోక నిర్గుణుని ♦ గన్గొను పేరువహించు చిత్తమా. 12

ఉ. ఆశకు మేరలేదు తను ♦ వాశనుజెందకు మత్సరంబుచే
నీశుని దూరిదూరి ఘన ♦ నీచములన్నియు నేనటంచు తా
నే శివమాడ్కి జిత్తులను ♦ నిందల బొందకు పాపకర్మివై
జేశిన తప్పులన్ని కడ ♦ జేయగ కృష్ణునివేడు చిత్తమా. 13

ఉ. హారికి సర్వశూన్యపద ♦ మారయు యోగిహృదాంత రంగ ము
ద్ధారికి సర్వపాపచయ ♦ దారివిదారికి యాగమాంత సం
చారికిభూరి విశ్రుతమ ♦ సార మనోమయకారికిన్ సదా
చారికి భక్తవత్సల వి ♦ చారికిమ్రొక్కుము వేగచిత్తమా. 14

ఉ. సారెకుమించి తత్వమసి ♦ జాడనుగన్గొను ధీరవై మహా
భారములైన ఘోరనృతి ♦ పాలును జెందక భావభేద్యవై
నూరిక చింతసేయమది ♦ నూర్వరితోడను పొత్తుబోకు నీ
దారినిజూచుకొమ్ము సరి ♦ దానవుగమ్ము గ్రహించుచిత్తమా. 15

ఉ. గోపరిపాలికిన్ సుగుణ ♦ కోవిద హృత్సరిపంకజాళికిన్
రూపవిధాన సంచరణ ♦ రూఢికి వారణ రక్షకారికిన్
గోపనవేదికిన్ వివిధ ♦ కోమలయంగ విశేషధారికిన్
చూపున గల్పిచూడు శుభ ♦ సూచనలందగ నిందు చిత్తమా 16

ఉ భావిశుభంబులన్ బడయు ♦ పాతక వృత్తిని జేరబోకుమీ
నేవిధమైన బాధలును ♦ నీకు చరించవు నిందు నందునన్
ఠీవిననుండు మాధవు ని ♦ టీవలనైన స్మరించునింక నీ
పావన భక్తిచేకొనుము ♦ భారముదీరి తరించు చిత్తమా. 17

ఉ. ఆకలి దప్పికోస మడి ♦ మోసముజేయ కహర్నిశంబులన్
పాకట మొప్పశ్రీధరుని ♦ పార్థనజేయుము జన్ము మీకడల్
దాకొని గ్రింగురీతి తగ ♦ ధార్మిక వృత్తిని జెందుచుండు మీ
పోకలు బోక నిష్ఠ పరి ♦. పూర్ణము నొందుము మూఢచిత్తమా 18

ఉ. వ్యక్తినవ్యక్తినైన తగ ♦ వ్యర్థపు మార్గమునందు జొచ్చి కా
సక్తిని మానివై పిదప ♦ యాచకవృత్తిని వేడునీపరిభా
శక్తిని విష్ణునిన్ దలచు ♦ శాశ్వతమోక్షము దెచ్చుకోమదిన్
యుక్తిని బన్నబోకు యిక ♦ నూరడివై చెడిపోకు చిత్తమా. 19

ఉ. రాజసవృత్తి చేకొనక ♦ రాజ్యము లేలెటి బుద్ధిపోక నీ
రాజ్యము ముక్తిదంబనుచు ♦ రాగవికారము లెల్లద్రుంచి నీ
రాజనమైన శ్రీహరి క ♦ లాపము గోరుము వేరుసేయకే
రాజ విరాజమానమగు ♦ రాజిత వెల్గును గూడు చిత్తమా. 20

ఉ. అక్షరమొక్కటే మిగుల ♦ యార్తినిదీర్చి త్రియక్షరాంతమై
కుక్షినినుంచి సార్వమును ♦ కుంభితపూరక మానసికవై
యక్షర హీనతన్ బొరసి ♦ యామెడ నేక్షణ వీక్షణాకృతిన్
దీక్షవహించి జూచినను ♦ తేజము తేజము నొందుచిత్తమా. 21

శా. ఆఖట్వాంగు డనంతరూపుని మదిన్ ♦ నాలించి వైకుంఠమున్
ప్రఖ్యాతంబుగ జూరబుచ్చె గదనే ♦ ప్రాప్తంబు చింతించవే
విఖ్యాతిన్ గనడే నజామిళుడిలన్ ♦ వేపాతకానుక్తుడై
సఖ్యంబున్ భయమున్ సభక్తియుతవై ♦ సాధించు మోచిత్తమా. 22

శా. ముఖ్యంబేగద భక్తిమార్గము కలిన్ ♦ ముమ్మాటికిన్ యాశుకన్
ప్రఖ్యాతంబుగ చూపులోనదెలిపిన్ ♦ ప్రజ్ఞావిశేషంబునన్
ముఖ్యంబంచు గనుం గొనంగద ♦ వెసీమాఘత్వమున్ ద్రెంచుమీ
వ్యాఖ్యానంబులు జేయుబోకు హరినే ♦ వర్ణించు మోచిత్తమా. 23

ఉ. కాశికి బోయినన్ గలదె ♦ గాశిలినొందుటగాని లోననే
వాశిని జెందినట్టి వన ♦ మాలినిజూడు గళత్రిసూత్రిమై
భాశిలువాని దెల్యకను ♦ బాల్పడు దుఃఖములోన జిక్కుటే
యాశ దురాశగాదె విను ♦ నార్తిని మాధవుగోరుచిత్తమా. 24

ఉ. సాధుతనంబునన్ హరిని ♦ సార్వము నీహృదయంబు లోపలన్
బాధలు లేక నెల్లెడల ♦ పాలనచేయు మటంచు మిక్కిలిన్

బోధయొనర్చు వెండియు ♦ తపోధనమున్ గయికొమ్ము వేగ మా
రాధన సేయునిత్యమును ♦ యాపదలున్ దొలగంగ చిత్తమా. 25

చ. ధనమునుగోరి దుష్టచరి ♦ తంబుల దూరి యనేక భంగులన్
మనమును మారి నీవికట ♦ మార్గములందున సంచరించ కే
వనజ దళాక్షు పాదములు ♦ వప్పగబట్టి స్మరించు నంతనే
కనుగొనవచ్చు మోక్షమును ♦ కానవు నీస్థితి మూఢ చిత్తమా. 26

ఉ. వానను పంటు పైరుగతి ♦ వర్ధిలువర్ధిలు జ్ఞానమార్గమున్
మానక దెల్యుమీజడము ♦ మానుము నిశ్చల తత్వమే తగన్
బూనుము శ్రీహరిన్ గనుము ♦ పూర్ణత గైకొను శాశ్వతంబుగా
ధ్యానసమాధినిష్టగొను ♦ దాస్యము జేయు తరించు చిత్తమా. 27

ఉ. పాపములోనజిక్కి పరి ♦ పాకములేక చరించుచుండి తా
లోపములెన్నొ జేయుచును ♦ లోననుయున్న విభున్ దలంచక
రూప వయోవిలాసముల ♦ రూఢిని జేసి తమోంధకారమే
దాపరమంచు మోహివయి ♦ తక్షణమున్ జెడిపోకు చిత్తమా. 28

ఉ. వాప్తివిగావె బుద్ధియెడ ♦ వల్లుచువల్లుచు బోధజేసినన్
నోపిక చేత నీమనసు ♦ నోపివినంగ నెఱుంగవైతి వే
కోపమె విస్తరించెగద ♦ కోరికెలెల్ల నశింప సాకెకున్
లోపలవేడవే హరిని ♦ లోలతజూపుము మూఢ చిత్తమా. 29

శా. ఎన్నోజన్మలు నెత్తినావు మును నిం ♦ కెన్నో నెత్తనున్నావుగా
వెన్నుండార్తశరణ్యు వేడిననునీ ♦ విన్నంటినిన్ బాయవే
యన్నానుత్తమ జన్మలోనె గనుమీ ♦ యంధత్వమున్ బాసిహా
యున్నాదంచును శ్రీహరిన్ విడువకన్ ♦ ధ్యానించుమో చిత్తమా. 30

శా. రమ్మామాధవు పాదసేవకును నే ♦ రమ్మామదిన్ దల్చవే
మమ్మా ప్రాణములంతమౌనపుడు నీ ♦ వమ్మాట రానిత్తు వే
గమ్మా దూతచయంబు గన్నతరి నా ♦ గమ్మాదు వేగానమై
కమ్మా యాకఫవాతపిత్తములచే ♦ కమ్మా నెట్లగున్ చిత్తమా. 31

శా. అమ్మా యాలునుబిడ్డలున్ మొగులు ని ♦ త్యమ్మామదిన్ జూడుమా
యమ్మా యమ్మెలుగాక నీమహిని నే ♦ హ్యాంబైన సంసారమున్
బొమ్మల్ నాట్యములంచుగాన వహాహా ♦ బోజూతువే మోక్షమున్
రమ్మావిష్ణుని పాదసేవకొరకై ♦ రాద్ధాంతమా చిత్తమా. 32

ఉ. తత్తరజేయుమింక గును ♦ తత్వములందున తత్వజాలమున్
హత్తినవేళ దేహమున ♦ హామికయుండునె రిత్తయానుగా
మత్తతచేత మాధవుని ♦ మానసమందున దల్చకున్న నీ
కుత్తికగోసి యంతకుడు ♦ కుంభి యఘుంబున నుంచుచిత్తమా. 33

ఉ. మోసము వచ్చునంచు మది ♦ మోహపుచింతలు బాసి తారకం
బీసనకన్ పఠించుతరి ♦ యీయెడగాక మరెప్పుడన్న న
భ్యాసము జూరబుచ్చుము న ♦ భంబనుదానిని జూడు దృష్టిచే
న్యాసముజేయుమో మిగుల ♦ న్యాయముగల్గు తరింప చిత్తమా.34

చ. ఘటమునకొక్క యీమఠము ♦ కావలిగాదె మఠంబుసాక్షిగా
ఘుఠమునుబోవు వెంటనె ర ♦ కారకియంతయు శూన్యరూపమై
యటులను దోచకుండుగద ♦ యారడిలోబడి పాపకర్మచే
తటుకున దుఃఖమబ్బుగద ♦ దాశరథీ యను మూఢచిత్తమా. 35

ఉ దృశ్యము నశ్యమౌగదవె ♦ దుమ్మెగజల్లిన దుమ్మగల్యదే
వశ్యముజేయవే హరి న ♦ వశ్యముపాధ్రనజేసి నేయడన్
హాశ్యము జాయకేమిట ర ♦ హాశ్యముబోధక మంచుమించులో
కాశ్యపియందు నిక్కమను ♦ కారణమున్ విడుమింక చిత్తమా. 36

మ. అరిషడ్వర్గములన్ని యాపుకొని యా ♦ నాత్మాయనాత్మన్దగన్
నిరుపేదన్గతినుండి యేకముగనే ♦ నిర్మోహివై యంతటన్
పరమున్జేరు నుపాయముంగను మహా ♦ పాండిత్యమున్జాలు నీ
దరిజేరంగను విష్ణునామమె గదా ♦ తత్వంబిదే చిత్తమా. 37

శా. సంతోషంబని మోహపాశములతో ♦ సంసార బంధంబులో
యంతోవింతగ కేళిసల్పెదవు నీ ♦ తంతుల్ విచిత్రింబగున్

చింతన్ జేయవు ముందుకర్మగతికై ♦ ఛీ భ్రష్టువై పోవటే
కంతన్ గానవు విష్ణుసేవ ఫలమా ♦ కాంక్షించు మో చిత్తమా. 38

మ. అరవిందాసను కూర్మికర్మ ఫలమే ♦ యందొక్కటిన్ దప్పనే
మరకన్ నీమరకన్ విదల్చుకొనుమా ♦ మాయన్ విడంబించకన్
దురితంబో యఘజాలమార్గమును మున్ ♦ దూరీకృతన్ జేయగా
పరమాత్ముండగు శ్రీహరిన్ దలచునీ ♦ పాటించుచున్ చిత్తమా.

ఉ. మాటలచేతగాని మది ♦ మాటకె మార్పులజేతగాని స
య్యాటలచేతగాని హరి ♦ యంచు దలంచుము గానవేత్తవై
దీటుకొనన్ మహారసము ♦ తీపిని గ్రోలి ముదంబుగాను మా
పాటవమొప్ప సద్గురుని ♦ ప్రాభవమొందుము నింక చిత్తమా. 40

ఉ. బ్రాతములోనె పాతక స ♦ మాజములోన వశించుకొంతనే
యాత్రిపుచేష్టలన్ దుమికి ♦ యాతనదెచ్చుట నొక్కటేగదా
సూత్రికధారి శ్రీహరిని ♦ జూచెటిమార్గము జూచుకోవు నీ
శాస్త్రము జాలునింక చర ♦ సాలకుబోకుము మూఢచిత్తమా. 41

ఉ. హాటకవస్త్రధారి మరి ♦ యాదను నీపయి దృష్టియుంచగా
బూటకమంచు తిర్గెదవు ♦ పోకిరివై నెటువృద్ధిబొందెదో
హాటకగర్భుడాది సుర ♦ లంత నుతించెడి దివ్యరూపు నీ
వేటికి జూచి వేడవదె ♦ వెఱ్ఱివె కుఱ్ఱవె నింకచిత్తమా. 42

ఉ. బుఱ్ఱకు నెక్కదేమొ మద ♦ పూరితమైన శరీరసౌఖ్యమున్
తొఱ్ఱయుగాదె నిన్నుకడ ♦ ద్రోయరె యంతకు సేవకాదులున్
గఱ్ఱనిగుఱ్ఱనేవు నిను ♦ కాల్చరె యాబడబాగ్నిలోన హాహా
వెఱ్ఱితనంబుమానిటుల ♦ వేడుము శ్రీహరినిందు చిత్తమా. 43

ఉ. అంతకుడెంతొ ఘాతకుడు ♦ నార్యులసేవను బుద్ధిదెచ్చుకో
నింతకు నింతఘోరమగు ♦ నిందెలబొందిన పాపకర్మి నీ
పంతము సాగనేర్చునె ప్ర ♦ పంచముకల్ల నిజంబుదెల్సుకో
చింతలజిక్కకే వ్యధను ♦ చింతిలబోకు తరించు చిత్తమా. 44

ఉ. ఋక్తతనంబునన్ మనసు ♦ రూఢిసిజేయక దోసకర్మలే
నొత్తుగజేసి రౌరవము ♦ నొందెదవేగతి గానవేమొ నీ
నుత్తలపాటు నొత్తుపడ ♦ నూరిక జిష్ణుని కృష్ణునేయడన్
తత్తరమొంది వేడుమిక ♦ దార్ఢ్యము తప్పక ముందె చిత్తమా. 45

ఉ. రాజసమేల యీసుశమ ♦ రాజిలునే పొలుపొంది నెప్పుడున్
నాజిని పారిపోవు విల ♦ యంబుననే తమముందుజిక్కి నీ
రాజనశక్తిలేకను వి ♦ రాజమునొందవె నింకవెల్లివై
భ్రాజితవిష్ణునామ కథ ♦ భద్రము క్షుద్రము వీడు చిత్తమా. 46

శా. అభ్రింకాంకిత మభ్రమంబుగదవే ♦ యామీదశూన్యంబగున్
విభ్రాభ్రాజితమైన ముక్తములెగా ♦ విభ్రాంతిచే నుండకన్
శుభ్రింబైన మహత్వ తేజమును తా ♦ శోధించి ముమ్మాటికిన్
నభ్రిప్రాపితుడైన శూన్యునిదయన్ ♦ యాచించుమో చిత్తమా. 47

శా. గర్భాగర్భితమైన వానినడకల్ ♦ గానంగలే రెందరో
శుభ్రాంశుండు మహోగ్రతేజమును తా ♦ జూడంగశక్తుండె యా
విభ్రాదభ్రగతుండునైనను సదా ♦ విభ్రాంతుడే నౌకదా
బభ్రాజంబుగనంగలేనిది గనున్ ♦ ప్రాప్తంబుగా చిత్తమా. 48

శా. సంసారంబను సాగరంబు కడలో ♦ సంసారివై సారెకున్
కంసారిన్ గనలేక నే జడమునన్ ♦ గార్హస్థ్యంబులేకుస్కినీ
సంసారంబునగూలి వ్యర్థమగు నీ ♦ సంకల్పమున్ మాయచే
హింసన్బొందగ కృష్ణుజిష్ణునిమదిన్ ♦ యీక్షించుమో చిత్తమా. 49

ఉ కాశి గయా ప్రయాగములు ♦ కాగలవన్నియు తీర్థయాత్రలున్
జేశినలేదు దృష్టములు ♦ చేతనమందు నిరూఢిలేకనే
రాశికిబుద్బుదంబులను ♦ లాగున మానుత్యజించి సత్యమున్
వాశికినెక్కి యాహరిని ♦ వావిరిసంస్తుతి జేయు చిత్తమా. 50

ఉ. భాసురమాని నీనడక ♦ భావము వంకర సంకటంబగున్
మోసము వచ్చునేయడల ♦ మోహపువార్ధిని బ్బంగబోకుమా

దాసునిరీతి వేడి తను ♦ దానను భావము బొందుమిక్కిలిన్
యీసుననుండబోకు నిట ♦ నీశుని వేడు తరింప చిత్తమా. 51

ఉ. ఆయణిమాది శిద్ధులగు ♦ యందరొ తాపసమూర్తులున్ మహా
కాయజు బంధ జాలములు ♦ గట్టిమనంబున గుట్టుజేసి యా
మాయను దూరుజేసి భవ ♦ బంధములన్నియు దూసివేసి స
ర్వాయువు బెంచి యీశ్వరుని ♦ వారక బొందిరి జూడు చిత్తమా. 52

శా. ఎన్నోమార్గములన్ జొరంబడియు తా ♦ మెన్నోవిధుల్ బూనియా
వెన్నుండార్త శరణ్యరక్షకునిపై ♦ నెన్నోకథల్ బాడుచున్
మున్నోమున్న గణించు పాతకములన్ ♦ మున్ముందుగాబోవ నీ
కెన్నోమారులు బోధజేసితిగదే ♦ నేమారకే చిత్తమా. 53

ఉ. రాగములన్ విశేష మను ♦ రాగములన్ భయమొందువేళలన్
రోగములన్ యనేకమగు ♦ లోభములన్ తగునట్టికర్మలన్
భోగములన్ సనాతన వి ♦ ముక్తములైన యఘంబులున్ మహా
యోగములన్ని దూరమగు ♦ నో హరిసేవ తరింప చిత్తమా. 54

ఉ. కాయము నస్థిరంబనుచు ♦ గన్గొను గన్గొనకున్న పాయమే
వేయువిధంబులన్ జెడక ♦ వేదముతోడగు నీ కుపాయమే
వాయజుడాది గాగలుగు ♦ వారలు భాగవతోత్తముల్ సదా
ధ్యాయము సేయు యీహరిని ♦ ధ్యానసమాధిని జేర్చు చిత్తమా. 55

శా. సాకారంబను నిర్గుణంబనెదు నీ ♦ సాహిత్యముల్ దెల్యమా
ప్రాకారంబగు దేహమే పతనమై ♦ ప్రాపించకన్ నుండుచో
నీకారుణ్యపదార్థ మెట్టులగునో ♦ నీ యోచనల్ సేయవే
యాకాలున్ దెసుబోవ వెంటనె మహా ♦ నాయాసమా చిత్తమా. 56

ఉ. పాంచికభూతియా ఘటము ♦ పాపసమేళనమై కృశించగన్
మించి నయోమయంబగును ♦ మీరిన శ్వాసలతోడ నేహ్యమై
గాంచెనుచూపు విస్మయము ♦ గన్గొనుదూతల చూచినంతనే
మంచితనంబు బోవుగద ♦ మానక శ్రీహరి జేరు చిత్తమా. 57

చ. పరుడణురూపుడైనిలచె ♦ పావనమూర్తి తదేకనిష్ఠతో
నిరుపమమైన యామూర్తిని న ♦ నేకముగా కడతేర్చుపాపులన్
దొరకొని జూచుచుండెనుగ ♦ దోరపుభక్తిని మ్రొక్కిమాటికిన్
పరమును గానవే హరిని ♦ పావన మూర్తిని వేడు చిత్తమా. 58

ఉ. కాయజు మోహజాలమున ♦ కన్నులుమిన్నులు జూచిభోగముల్
బాయనటంచు కాములను ♦ బాసట బోయెదవేమొ సారెకున్
రాయివె మోక్షమబ్బె కళ ♦ లాయివె లాహిరివైననీకు నే
తాయినిగూర్తు శ్రీహరి బి ♦ డారును వేడుమునింక చిత్తమా. 59

ఉ పుట్టువులో మనుష్యుడను ♦ పూర్వకృతంబున బ్రాహ్మణుండనై
కట్టడికార్యముల్ సలిపి ♦ కాదనునిందెల బొందితింక నీ
పట్టుననైన శ్రీహరిని ♦ ప్రాపకమంచు స్థిరంబుగామదిన్
డట్టకకాలు వీటికిని ♦ దారుణ వృత్తినిబోకు చిత్తమా. 60

ఉ. తుచ్ఛసుఖంబులన్ మరగి ♦ తూగుచు సంతసమొందెదేమొ నీ
యిచ్ఛను మానుమానిక స ♦ హింపను దుర్గతి పొంతబోవగా
స్వచ్ఛమెనిచ్ఛలున్ హరిని ♦ స్వాగతు జేయుము స్వప్నలబ్ధమా
పుచ్ఛముద్రొక్కు సర్పవిష ♦ పూరితమా పడిపోవె చిత్తమా. 61

ఉ. కోపముచేత పాపమును ♦ గుట్టలరీతి గణించుచుందువే
పాపముచేత దుర్గతికి ♦ పాలుపడంగ తరించనేర్తువే
బాపురె యీమురారికథ ♦ బాయక సంతసమొందుచుండవే
రేపునుమాపు లేపుమది ♦ రేచక కుంభకమందుయోగివై. 62

ఉ. తాపసులున్నజాడలును ♦ తాత్పరియంబున జూచుత్రోవయే
నోపుదు నిక్కటంబుగను ♦ నోముఫలించును సారమొందెదా
లోపము లేదు నిశ్చయము ♦ లోననుపట్టి హరిన్ దలంపుమీ
కాపురముండె దచ్చటను ♦ కాగల త్రోవ నుతించు చిత్తమా. 63

శా. యజ్ఞేశుండని యజ్ఞకర్తయని తా ♦ యజ్ఞంమనంబిందునన్
ప్రాజ్ఞుల్ మెచ్చగనుంచు మిక్కిలిదె నీ ♦ ప్రాప్తంబునన్ సాజ్ఞచే

యజ్ఞానంబువిడంగ జేయుటిదె నా ♦ నాయచ్యుతున్ వేడగా
సుజ్ఞానంబునుగల్గి మోక్షపదవిన్ ♦ జూపట్టునో చిత్తమా. 64

శా. ఆ ప్రాచీనము సంచితంబును తగన్ ♦ యామీద నాగామియున్
స్వప్రాల్పించునె నిచ్ఛచేత దిరుగున్ ♦ సంసారవార్ధింబడన్
సంప్రాప్తంబగు నట్లుగా విధివశా ♦ త్సంసర్గబోనున్నదే
ఆ ప్రాప్తంబగు దానిప్రాప్తమగు నీ ♦ యంతస్సునన్ చిత్తమా. 65

శా. శ్రీరామారఘురామ రామయనుచున్ ♦ చిత్తంబులో హత్తినన్
నేరామామణి నోముపంట యనుచున్ ♦ నెందెందు ప్రఖ్యాతిగా
తోరంబొప్ప స్మరించుచున్న మదిలో ♦ ద్రోహంబులౌ దోసముల్
సారంబుల్ జెడి ఛిద్రమౌను గదని ♦ స్సారంబుగన్ చిత్తమా. 66

ఉ. బోధను దెల్సి మానసము ♦ బొందుసపోవగ నీకసార్వమున్
మాధవుపాద చింతనలు ♦ మగ్నముగా వచియింపుచుండు మీ
బాధలు దొల్గు యాపదల ♦ బోరునశించును విష్ణుమందిరా
రాధనగల్గు ముక్తిపద ♦ మారయగాంతువు నిచ్చ చిత్తమా. 67

శా. సన్యాసంబునలేదు చాలజపముల్ ♦ సాధించినన్ లేదు నీ
సన్యాకాంతపు మాటలన్ వినినసే ♦ యాయుంతలోపోవునే
వస్యంబుల్ నమలంపు యాత్రలనుచున్ ♦ వర్తించెనన్ లేదుగా
ధన్యోస్మీన్ యని చిత్తశుద్ధిగ మాకన్ ♦ దల్పంగదే చిత్తమా. 68

మ. శతిసర్పంబులు చుట్టుజుట్టిన గతిన్ ♦ చాంచల్యమౌనప్పుడే
కతనన్ దల్తువు రామనామము సదా ♦ గ్రాహ్యంబు నున్నప్పుడే
వ్రతముల్ నిష్టను నిష్టగా నడుపుమీ ♦ ప్రాప్తంబు మందైనచో
వెతలున్ బోవును ముక్తికారణమగున్ ♦ వేవేగనో చిత్తమా. 69

ఉ. గోచరమౌ పదార్థమును ♦ గోరుట నెక్కువగాదు మిక్కిలిన్
సూచనచేనగోచరము ♦ జూడగ గోరుము శక్తిచేతనే
వాచక వృత్తిచేత భవ ♦ బంధములన్ విడనాడి హెచ్చునా
లోచనచే వచించనిది ♦ లోచనసౌజ్ఞను సంతసంబుగా
దాచిన వస్తువంచు తమి ♦ దీరనుతించుము వేగచిత్తమా. 70

ఉ. గవ్వలు రాల్చురీతిగను ♦ గ్రాహ్యముతోడుత కర్మబంధముల్
నువ్వులు రాలుకాయులన ♦ నూరిక ద్రోయుము చిత్తశుద్ధిగన్
బువ్వను దిన్నమాడ్కి పరి ♦ పూర్ణసుఖంబును బొందు వేగమే
చివ్వకుబూని తస్కరుని ♦ చేష్టలబోక తరింతు చిత్తమా. 71

శా. వేదాంతంబులు గీతలర్థములు నీ ♦ వేమేమి గన్గొందువే
మోదంబందుచు భక్తిమార్గమున నా ♦ మోదించు ముమ్మాటికిన్
భేదంబేమియు లేక జిష్ణునియడన్ ♦ ప్రీతిన్ మనోవ్యక్తిచే
నాద బ్రహ్మమునందు జిక్కుము సదా ♦ నాహ్వాయమౌ చిత్తమా.

ఉ. క్రోధముచేత పాపమును ♦ గూడును కొండల పెంపుగాను నీ
క్రోధముచేత హృద్వనవి ♦ గోచరమౌ కడుదుఃఖసంపదన్
క్రోధము యాలవాలమయి ♦ కూర్చును శూలములున్నచాడ్పునన్
క్రోధమువీడ శ్రీ హరిని ♦ గోరుముగోరుము మూఢచిత్తమా. 78

చ. తృణమును నేటబడ్డగతి ♦ త్రోయును దుర్లభమౌ సుడిన్బడన్
పణుకును బట్టలేవు మది ♦ పారుడువేగము బోవవచ్చునే
పాణికను వృక్షమూలమును ♦ పొంతనుబట్టిన నీదనేర్తువే
వణికుని సాక్షిసాక్షియగు ♦ వద్దహరిన్ తగవేడు చిత్తమా. 74

ఉ. కుమ్మరపుర్వు యావటము ♦ గూడుము పద్మము యందుబిందువుల్
గొమ్మని సాటినీకు గుణ ♦ కోవిదవైదరి ముట్టుచున్నిటన్
సొమ్మనిగోరు యాపరుని ♦ సోహమనస్కునిగాను జూడు నీ
జుమ్మరులన్ని బాయునిక ♦ చోద్యము గైకొను నిందుచిత్తమా 75

మ. నిముషంబున్ విడబోకుమింక హరినే ♦ నీయోగదృష్టంబునన్
తిమసంబుల్ విడి తేజరూపివగుచున్ ♦ తత్వార్థతన్ గందువే
భ్రమలన్ బాయుము నిర్గుణానుభవమున్ ♦ బ్రాపింప నిర్దోషివై
క్రమ మొప్పంగను వెల్గులోన వెలుగై ♦ కల్యాణతన్ చిత్తమా.

ఉ. వాయసవృత్తిగా దిరిగి ♦ వ్యాసటబొందుచు నెన్నొభంగులన్
బాయని పాపపుంజముల ♦ పాలునసీగి తరించరేని నీ

కాయము నస్థిరంబనుచు ♦ కామితముల్ విడ ద్రోసివాక్కుల
ధ్యాయము సేయు శ్రీహరి న ♦ వారిత మొప్పగనింక చిత్తమా. 77

శా. అష్టావింశతి దుష్టనరకములనే ♦ యాశింపకన్ వేగమే
దృష్టాదృష్టములన్ని గన్గొనుచు నీ ♦ దృష్టంబులా దోసముల్
స్రష్టన్ దూరక బాపుకొమ్మనిట నీ ♦ సౌఖ్యంబు పెంపొందగా
విష్ణున్ దల్చుము నేకమానిసివి నై ♦ వేవేగమో చిత్తమా. 78

శా. చుట్టున్ జుట్టుకొ నీదువారు వరుసన్ ♦ జూపుల్ విడంబించగా
పట్టీయంచు వచింతురా ర్తవమునన్ ♦ బట్టంగయాదూత వే
గట్టన్ నోరునులేక నేడ్చెదవహో ♦ కాఠిన్యబంధంబులన్
దట్టన్ బోక హరిన్ దలంపుమిహామున్ ♦ దప్పించునో చిత్తమా. 79

ఉ. హాయిని లేదుగా మనము ♦ నంతకు నంతకు క్షీణమైనచో
వేయిని వెంటరావ్వగద ♦ వేగమె నాహరి పాదసేవచే
హాయినిగమ్ము మీదొడను ♦ యారడినొందక నుండుమాటికిన్
ద్రోయుము నీకళంకములు ♦ దోర్బలశక్తిని మూఢచిత్తమా. 80

ఉ. పూరినయాకులున్ నుదక ♦ పూరితమై తగుభోజనంబుగా
దూరములందు వన్యముల ♦ తోరముతోడుత నున్న నేమి వి
స్తారత జంబుకాకమృగ ♦ సంచరణాకృతిగా మునీశ్వరుల్
జేరుట నెట్లుముక్తి హరి ♦ చింతనులేక తరింపచిత్తమా. 81

ఉ. కారణమానె కర్మలు న ♦ కారణమా జన రంజితార్థమై
ధారుణి జేయుచుందురది ♦ తప్పకవచ్చును మోక్షసాధనే
కారణమాను తత్వమును ♦ గన్గొని ధ్యానముసేయ శ్రీహరిన్
చేరు నుపాయముల్ గలదు ♦ చింతనసేయుము నింకచిత్తమా. 82

చ. గృహము నరణ్యమొక్కటిగ ♦ గూర్చి విరాగముతో దిగంబరుల్
గుహలను పట్టణంబు లను ♦ కూలముతోగత వ్రీడలైననో
నిహమున గార్థభంబులును ♦ నిట్టుల దిమ్మరులై చెరించవే
తహతహలేల శ్రీహరిని ♦ దల్చుము మోక్షముగల్గు చిత్తమా. 83

ఉ. వేదము శాస్త్రముల్ జదువ ♦ వేడుకగల్గిన లేదు దానిచే
మోదముగాదు బ్రహ్మమును ♦ మూగపదార్థము తెల్విలోననే
భేదముదెల్సి సెప్పును న ♦ భేద్యమవద్య మగోచరంబు నా
మీదనుజూడు కల్యమిక ♦ మీదను తొందర జేయు చిత్తమా. 84

ఉ. యోగులు గంగవడ్డులను ♦ యోగముల్ నివసించ నేమియూ
భోగములంది జన్మమృతి ♦ పోకడలన్ దగు నెట్లుజూచు నా
లోగము బ్రహ్మ విష్ణుశివ ♦ రూపములన్దగు నెట్లుజూచునా
యోగములేల శ్రీహరిని ♦ యోచన జేయుమునింక చిత్తమా. 85

చ. యొకయొక పూటభుక్తిగొని ♦ యూరకుపోష్యము లెన్నొజేసి తా
నొక నియమంబు నేర్పరచి ♦ నోర్పున కాయము శోషిలంగనే
సుకరములేదు మూఢునకు ♦ సొంపుగ మాయత్యజించి విష్ణునిన్
సకలము నీవెయంచు మది ♦ జాటిన మోక్షముగల్గు చిత్తమా 86

ఉ. కాయము నొంతొ దండనము ♦ గాగనుజేసిన ముక్తిగల్గునే
మాయనుగూడి జ్ఞానమును ♦ బాసితివింకను పుట్టమీదనే
బాయక నెన్నిగొట్టినను ♦ బాయునె ప్రాణము కాలసర్పముల్
వేయువిధంబులన్ హరిని ♦ వేడిన మోక్షము గాదె చిత్తమా. 87

చ. జటలనుబారు బెంచి తన ♦ సాధన డాంబికవృత్తిబూసియే
నటునిటు వేషధారియగు ♦ నాతనిజూచి భ్రమించులోకముల్
పటుతరమైన జ్ఞానియని ♦ బల్కుదురంతెయుగాక నిశ్చయం
బెటువలెగల్గు మాధవుని ♦ నేర్పడవేడక యున్న చిత్తమా. 88

ఉ. మృత్తును భస్మమున్ మిగుల ♦ మూర్ఖత దుమ్ముశరీర లేపనం
బొత్తుగజేసినన్ గలదె ♦ యూరకమానవ కోటికెయ్యెడన్
నిత్యమువాపి మృత్తుకను ♦ నిండుగబూతిని బొర్లుచుండదే
సత్యముతోడ శ్రీహరిని ♦ సాకుమటంచును వేడు చిత్తమా. 89

శా. సంసారంబు సుఖంబుగాదనుచు తా ♦ సాధించునే విజ్ఞుడున్
సంసారంబుననుండి జూడవలెగా ♦ సంయోగమూ యోగమున్

కంసారిన్ గనలేక బ్రహ్మవిదుడే ♦ కర్మంబునున్ బాయకన్
హింసంబొందును కర్మబ్రహ్మలవిడన్ ♦ నేహ్యంబిదే చిత్తమా. 90

ఉ. చెప్పిననన్ని జ్ఞానమున ♦ సేయగవచ్చు ముకుందుసాక్షిగా
నెప్పుడు చిత్తశుద్ధిగను ♦ నేమరకుండగదల్చుమోక్షియనా
తప్పక జ్ఞానహీనుడయి ♦ తంతులుజూపిన లోకమందునే
గొప్పయుపేంద్రునిన్ దలచ ♦ కోరికెలెల్ల ఫలించు చిత్తమా. 91

మ. తవతాపంబును పాపముల్ ఘనముగా ♦ తప్పింపనే రూపునన్
యవికారాది సమూహభావమును నే ♦ యాసింపకన్ బ్రహ్మమై
నవిలోమాదివిలోలతన్ దిరుగునా ♦ యాయాశ్ర సంపాదియై
మవలన్నుండుము మోక్షసాధనముకై ♦ యాచించుమో చిత్తమా.

శా. జ్ఞానాజ్ఞానవిభక్తులన్ దెల్యనే ♦ జ్ఞానంబు సాహిత్యమున్
గానన్లక్షిత లక్షణంబులు గణాల్ ♦ గావింపగాలేను యే
దానన్ జెప్పితినో శతంబులగు నీ ♦ తాత్పర్యసంబోధనల్
మానంబందున చక్రినిన్దలుచ స ♦ న్మానించనో చిత్తమా. 93

ఉ. శ్రీ శివవాణి యద్భుతపు ♦ చిన్మయరూపము నెల్లదాల్చినన్
దోసిలినొగ్గి తన్మయత ♦ త్రోవ నెరుంగక యున్నభర్తలన్
రాశికిదెచ్చి శక్తిని వి ♦ రాజముగా గనుపింప జేసిరే
వాసిగమూలమై నిలచి ♦ వర్ధిలజూచు పరాంబ చిత్తమా. 94

ఉ. ధారణలోన జూచినను ♦ దారుణమేగద తారుమార్కైనా
ధారము గాగనుంగొను త ♦ దావలముచ్చటలన్న సూచనల్
సూరిజనాను కూలమగు ♦ స్థూలముసూక్ష్మము శూన్యమైనచో
దారముపట్టునన్ వెలుగు ♦ తాననియోచన జేయు చిత్తమా. 95

చ. పరుడు పరాత్పరుండనుచు ♦ భావములోదలపోసి యన్యమున్
నురచిత్రివేణి సంగమము ♦ మక్కువచేగని పైవెలుంగునే
వెరువకజూడునేననెడు ♦ వింతపదార్థము గొమ్మ మిక్కిలిన్
సరసముసైన నామధుర ♦ సంబున్రగోలుము వేగ చిత్తమా. 96

ఉ. ధీరస మొప్ప నిర్గుణ మి ♦ దే యని దేహాని యాచకార్తిచే
దూరము వెంటదాకుమిక ♦ తోరముతో శుభదాయివాడు వే
కోరికజెల్లునే వివిధ ♦ కోమలతేజము లబ్బుచుండునే
సారెకు శ్రీహరిన్ దలుచు ♦ సంపదలన్నియు గల్గు చిత్తమా. 97

ఉ. భాగవతార్థ తత్వమును ♦ బాగుగనీమన మందునుంచి నీ
యోగములెల్ల జూడు పర ♦ యోగములన్ బడబోకు సమ్మతిన్
భోగపదంబులందు పరి ♦ పూర్ణముజెందు మనంతు నీశునిన్
బాగుగ వేడుకొమ్ము సుల ♦ భంబగు మోక్షముగమ్ము చిత్తమా.

చ. వ్యయమును సేయ సమ్మతము ♦ యూలఘటించదు భావుకంబుగన్
రయమున దుష్టవృత్తిని ని ♦ రామయమానటు జేయుమింక నే
నయసునుదీశ వేగను వి ♦ నాయకరూపము దాల్చినిర్గుణా
మయమగు కర్మసాక్షివని ♦ మానక ధ్యానము జేయు చిత్తమా. 99

చ. నియతిని జెల్లుకాలమది ♦ నేర్పునొకింతయు లేకమూఘులై
కయితముచేత కిల్బిషము ♦ గానటియించిన వానితొ్రివలే
బయలునుగాదె యంతకుని ♦ భావములో తగదాగియుండునే
నియమముతోడ శ్రీహరిని ♦ నీవు తరింప స్మరించు చిత్తమా. 100

ఉ. సంతతిలోన ముఖ్యమగు ♦ సంతతియే కృతిగానదీనినే
సంతతిరాదు ధాత తన ♦ సంతతిపూర్ణము జేయలేదని
స్సంతతిగా నొనర్చు కవి ♦ సంతతులే గొనియాడ తారకా
సంతతినుండుదాక రవి ♦ చంద్రులపోకడనుండు చిత్తమా. 101

ఉ. నెవ్వరుభక్తిచే గొనియు ♦ నివ్వటిలంగను నున్నవారలో
చివ్వునలేచి మార్గమని ♦ చేరిపఠింపుచు నున్నగాని యా
నవ్వుచు విన్న వ్రాసినను ♦ నాయకముత్యసరుల్ జనార్దనుం
డివ్వగ గోరినారనుచు ♦ సింపుగ మోక్షమునిచ్చు చిత్తమా. 102

ఉ. వెంకట శోభనాద్రికవి ♦ వేమరుబోధకమైన పద్యముల్
కింకర బాధలుల్ దొలగ ♦ కీర్తికి మూలముగాగ సెప్పెగో

రింకల చిల్కపల్కులకు ♦ దిత్తలొనర్తురె బెంచువారు యే
వంకను చెర్కుతీపియను ♦ వార్త లెరుంగరె నింక చిత్తమా. 103

శా. విద్వాంసుండనుగాను వ్యాకరణమా ♦ విఖ్యాతి నే గాంచనే
విద్వాంసుల్ బహుమంది లక్షణములన్ ♦ వేర్వేరుగా మెంచిరా
సద్వృత్తిన్ మదినుంచి మెచ్చినధరన్ ♦ సంకల్ప మీడేరుగా
మద్వంశంబు తరింపవ్రాసితిని నే ♦ మామాటికిన్ చిత్తమా. 104

చ. కనుగొన శాలివాహన శ ♦ కాబ్దమునొక్కటి యున్మిదంతపై
వినగను నాలుగేడువిధి ♦ వెంటను లెక్కగు క్రోధనాబ్దమున్
పనిగొన మాసమాశ్వీజము ♦ బాల్పడశుక్ల త్రయోదశందునన్
అనయము నేస్మరించుటకు ♦ యార్తిని సెప్పితి నింక చిత్తమా. 105

సంపూర్ణము.

---

